చదవండి   శ్రీరస్తు   చదివించండి

సంగ్రహ

# ప్రపన్న దినచర్య

వంశీ విభూషితకరాత్ నవనీరదాభాత్
పీతాంబరా దరుణబింబ ఫలాఽధరోష్ఠాత్ ।
పూర్ణేందు సుందరముఖా దరవింద నేత్రాత్
కృష్ణాత్పరం కిమపి తత్త్వ మహం న జానే॥

సమాహర్త :-

ఉ.వే. శ్రీమాన్ K. S. రామానుజాచార్యస్వామివారు

ఉభయ వేదాంత సభ

పెంటపాడు—534 166.

1993

ఉభయ వేదాంత సభా ప్రచురణ-2
శ్రీముఖ సంవత్సరాది కానుక
ప్రథమ ముద్రణ-1993
కాపీలు-500

ప్రాప్తి స్థానము :
N. హేమాబ్జవల్లి
W/o N. V. L. N. రామానుజాచార్యులు
పెంటపాడు-534166

మూల్యము 4/- రు.

ముద్రణ : సప్నా ఠాగూర్
ఆనన్దకుమార్ ప్రింటర్సు, పెంటపాడు.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.

శ్రీరస్తు

# మున్నుడి

మాధవో మాధవో వాచి మాధవో మాధవో హృది।
స్మరన్తి మాధవం సర్వే సర్వకార్యేషు సర్వదా॥
(పాండవ గీత)

ఆర్యా!

తల్లిదండ్రులు తమ పిల్లలను ఆరోగ్యవంతులనుగ, గుణవంతులనుగ, విద్యావంతులనుగ, చేసి ఉత్తమ పౌరులనుగ, వారిని తీర్చిదిద్దవలసియున్నది. ఈ మహత్తర కర్తవ్యమా పిల్లలను కేవలము స్కూళ్ళకు పంపినంత మాత్రమున నెరవేరదు. తల్లిదండ్రులే ఆదర్శప్రాయమైన తమ నడివడికతో పిల్లలకు మార్గదర్శకులు కావలయును.

సత్ప్రవర్తన మానవాభ్యున్నతికి మూలము దీనికి పాపభీతి, దైవభక్తి ఆవశ్యకములు. దైవభక్తి ఆత్మవిశ్వాసమును, ధైర్యమును, ఉత్సాహమును, మనశ్శాంతిని ఇనుమడింప చేయును. తల్లిదండ్రుల ద్వారా ఇవి బాల్యముననే పిల్లలలో ఏర్పడవలయును దైవభక్తి దైవప్రార్థనతో దైవధ్యానముతోను ప్రారంభమగును. అర్చనదాని బాహ్యరూపము. భగవంతుడు సర్వాంతర్యామి కదా! కావున మనము చేయు ప్రతిమంచిపని అతని కైంకర్యమే కాగలదు. 'మానవసేవయే మాధవసేవ అను సూక్తి ఏర్పడుటకు కారణమిదియే. అలనాటి ధ్రువ, ప్రహ్లాదులే గాక ఈ శతాబ్దిలోని శ్రీరామకృష్ణ పరమహంస, శ్రీవివేకానందులు, మహాత్మాగాంధీ మున్నగు మహనీయులునుఇట్టి దైవీభావనతోనే తమ జీవయాత్ర సాగించినారు. కావున శారీరకముగనే కాక ఆధ్యాత్మికముగను మనముసుఖజీవనమును సాగింపవలయును. ఇందులకై మనము సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందును భగవంతుని స్మరించుచు మనకైనందిన

కార్యములను నిర్వర్తించుకొనుచుండవలయును. దీని కొఱకే ధ్యానశ్లోకములు, స్తోత్రములు, పాటలు, కీర్తనలు, నామసంకీర్తనలు ఏర్పడినవి.

కొందఱు మిత్రుల ప్రోత్సాహముతో; లౌకిక వృత్తివ్యాపారములలో తలమునకలై ఉన్నవారు సైతము ప్రతినిత్యము ఆయా సందర్భములలో అనుసంధించుకొనుటకు వీలుగా ధ్యానశ్లోకములను విష్ణుభక్తి ప్రధానముగా ఏర్చి కూర్చి "సంగ్రహ ప్రపన్న దినచర్య" అను పేరుతో మీముందు ఉంచుచున్నాము. స్త్రీపురుష భేదము లేక ఆబాలగోపాలము ఈ శ్లోకములను కంఠస్థము చేసి సందర్భాను సారము వీటిని అనుసంధించుకొనుచు తమ పిల్లలచే అనుసంధింపజేయుచు భగవదనుగ్రహమునకు పాత్రులై విజయఆయురారోగ్య-ఐశ్వర్యాదులను పొంది సుఖశాంతులతో వర్ధిల్లుదురుగాక.

"స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్" (భగవద్గీత) ధర్మమును కొలదిగ ఆచరించిన ను అది మనలను అన్నివిధముల రక్షించును.

సర్వేజనా స్సుఖినో భవన్తు
లోకాస్సమస్తా స్సుఖినో భవన్తు
సమస్త సన్మంగళాని సన్తు

పెంటపాడు,
పశ్చిమగోదావరి జిల్లా
534166

ఇట్లు
ఉభయ వేదాన్త సభ



శ్రీరస్తు

ఓం నమో భగవతే వాసుదేవాయ

# గీతోపనిషత్సారము

సర్వగుహ్యతమం భూయః శృణు మే పరమం వచః।
ఇష్టోఽసి మే దృఢమితి తతో వక్ష్యామి తే హితమ్॥

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు।
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే॥

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః॥

భ. గీ. 18:64-65-66 శ్లో॥

"అర్జునా; నీవు నాకు మిక్కిలి ఇష్టుఁడవు. కావున ఉత్తమోత్తమము, రహస్యాతిరహస్యము అయిన హితమును నీకు ఉపదేశింతును. సర్వదా మనస్సును నాయందే నిల్పుము. నన్నే భజింపుము, నన్నే ఆరాధింపుము.

(మదేకశేషత్వసూచకముగ) నాకే నమస్కరింపుము. నన్నే పొందగలవు. నాకు నీవు ప్రీతిపాత్రుడవు కావున ప్రతిజ్ఞచేసి చెప్పుచున్నాను. ఇది సత్యము. సర్వధర్మములను (ఉపాయతః) పరిత్యజించి (ఆశ్రితసులభుడైన) నన్నే శరణు పొందుము. (సర్వజ్ఞత్వ సర్వశక్తిమత్త్వాది గుణములు గల) నేను నిన్ను సర్వపాపములనుండి విడిపింతును. ఇక దుఃఖింపకుము" అనునది గీతాచార్యుని సిద్ధాంతోపదేశము.

ఇది యోగసారము.

**ఇది భగవద్వాణి.**



# —: కృతజ్ఞతలు :—

ఈ గ్రంథ ముద్రణకు సంకల్పించినంతనే ఉభయ వేదాంత సభకు వేయి రూప్యములు సమర్పించిన

శ్రీమతి **శ్రీమత్తిరుమల తాయరమ్మ** గార్కి—

వారి కుమారులు, ఈ ఉభయ వేదాంత సభకు బాసటగా నిలచిన

**శ్రీమత్తిరుమల వెంకట తాతాచార్యులుగార్కి—**

మా కృతజ్ఞతల నర్పించుచున్నాము.

శ్రియఃపతి వారికి సకలశ్రేయములు చేకూర్చుగాక యని ప్రార్థించుచున్నాము.

ఉభయ వేదాంత సభ

శ్రీరస్తు

# -: కొన్ని ముఖ్య సూచనలు :-

1. తీరిక సమయములో సత్సంగము సద్గ్రంథ పఠనము గావింపవలెను.
2. ఏకాదశీ వ్రతమును తప్పక పాటింపుము.
3. మనస్సును ప్రశాంతముగ ఉంచుకొనుము.
4. ఆళ్వార్ల దివ్య ప్రబన్ధములను పూర్వాచార్యస్తోత్రములను కంఠస్థ మొనర్పుము.
5. మనకు పెన్నిధియైన సంస్కృతభాషను నేర్పుము.
6. పెద్దల శ్రీసూక్తులను వినుచుండుము.
7. దుర్వ్యసనములకు లోనుకాకుండుము.
8. ధర్మమార్గమును వీడకుము. అది నిన్ను రక్షించును
9. తులసి మొక్కలను పూల మొక్కలను పెంచుము.
10. మంచిని పెంచుకొనుచు ఇతరులకు సాయపడుము.

ధర్మో రక్షతి రక్షితః

శ్రీరస్తు

శ్రీమతే రామానుజాయ నమః

సంగ్రహ

# - ప్రపన్న దినచర్య -

## —: ప్రాతః స్మరణము :—

ఉదయమున నిద్రలేచినంతనే భగవంతుని హరిర్హరిః అని ధ్యానించుచు ఈ క్రింది శ్లోకములను అనుసంధింపవలెను.

ప్రాతః స్మరామి దధిఘోష వినీతనిద్రం
నిద్రావసాన రమణీయ ముఖారవిన్దమ్।
ఉన్నిద్ర పద్మనయనం నయనాభిరామం
హృద్యానవద్య వపుషం నవనీత చోరమ్॥

ప్రాతః స్మరామి భవభీతి మహార్త్తి శాన్త్యై
నారాయణం గరుడవాహన మంజనాభమ్।

గ్రాహాభిభూత మదవారణ ముక్తి హేతుం
చక్రాయుధం తరుణ వారిజ పద్మ నేత్రమ్॥

ప్రాతర్నమామి మనసా వచసా చ మూర్ధ్నా
పాదారవిన్ద యుగళం పరమస్య పుంసః।
నారాయణస్య నరకార్ణవ తారణస్య
పారాయణ ప్రవణ విప్ర పరాయణస్య॥

ప్రాతర్భజామి భజతా మభయంకరం తం
ప్రాక్సర్వజన్మకృత పాప భయాపహత్యై।
యో గ్రాహవక్త్ర పతితాంఘ్రి గజేంద్ర ఘోర
శోక ప్రణాశనకరో ధృతశంఖ చక్రః॥

ప్రహ్లాద నారద పరాశర పుండరీక
వ్యాసాంబరీష శుకశౌనక భీష్మదాల్భ్యాన్।
రుక్మాంగదార్జున వశిష్ఠ విభీషణాదీన్
పుణ్యానిమాన్ పరమ భాగవతాన్ స్మరామి॥

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



యద్వేదమౌళి గణవేద్యమవేద్యమన్యైః
యద్బ్రహ్మరుద్ర సురనాయక మౌళి వంద్యమ్।
తత్పద్మనాభ పదపద్మమిదం మనుష్యైః
సేవ్యం భవ ద్భిరితి దర్శయతీవ తార్క్ష్యః॥

—: భూదేవీ ప్రార్థన :—

పృథ్వి!త్వయా ధృతా లోకాః దేవి;త్వం విష్ణునా ధృతా
త్వం చ ధారయ మాం దేవి పాదస్పర్శం క్షమస్వ మే॥

—: దన్త ధావనము :—

ఉత్తర ముఖముగా కూర్చొని దన్తధావనము కావించుకొనవలయును. పిమ్మట కాళ్ళు, చేతులు నీటితో శోధించుకొని కండ్లు తుడుచుకొని ఆచమనము చేయవలయును.

అచ్యుతాయ నమః, అనంతాయనమః, గోవిందాయ నమః అను మంత్రములను ఉచ్చరించుచు ఒక్కొ

క్క నామముతో ఒక్కొక్క పర్యాయము కుడిచేతిలో (పుడిసెటిలో) తీర్థమును తీసికొని పుచ్చుకొనవలయును. పిమ్మట కేశవాయ నమః, నారాయణాయ నమః, మాధవాయ నమః, గోవిందాయ నమః, విష్ణవే నమః, మధుసూదనాయ నమః, త్రివిక్రమాయ నమః, వామనాయ నమః, శ్రీధరాయ నమః, హృషీకేశాయ నమః, పద్మనాభాయ నమః, దామోదరాయ నమః. శ్రీవాసుదేవాయ నమః, అని ఉచ్చరింపవలయును. పిమ్మట యథోత్సాహము వ్యాయామ మొనర్పవలయును.

—: స్నానము :—

స్నాన మొనర్చునప్పుడు గంగ, యమున, కావేరి కృష్ణ, గోదావరి మున్నగు పవిత్ర నదులలో స్నానమాడు చున్నట్లును, ప్రత్యేకించి శ్రీమన్నారాయణుని పాదారవిన్దము నుండి ప్రవహించుచున్న గంగధారలో స్నానమాడుచున్నట్లును భావించుచు ఈ క్రింది

శ్లోకములను పఠింపవలయును.

గంగే చ యమునేచైవ గోదావరి సరస్వతి।
నర్మదే సింధు కావేరి జలేఽస్మిన్ సన్నిధిం కురు॥

కావేరీ మవగాహిషీయ భగవ
ద్భోగాంతరాయీ భవత్
కర్మక్లేశ ఫలాశయ ప్రశమనో
ద్వేలాఽమల స్రోతసమ్।
జంతో స్సంసరతోఽర్చిరాది సరణి
వ్యాసంగ భంగాయుషా
లోకేస్మి న్నిర్వ జేవ వేల్లితజలా
శ్రీరంగ మాలింగతి॥

—: స్నానానంతరము :—

స్నానానంతరము తీర్థముతో (కుడిచేతినడిమి వ్రేలితో) లలాటమున జలోర్ధ్వపుండ్రమును ధరించిముందు

చెప్పిన రీతిగా ఆచమనము గావించి కొద్దిగా చింత పండు తీసికొని దానిమీదుగా పడే జలముతో కేశవాది ద్వాదశ నామములను ఉచ్చరించుచు పండ్రెండు పర్యాయములు చెంబును లోపల వెలుపల కడిగి శుద్ధి చేయువలయును. ఇట్లు శుద్ధిచేసిన చెంబుతో తీర్థమును తీసికొని పుడిసెటిలోకి కొంచెము తీర్థము తీసికొని నేలమీద "శ్రీమతే రామానుజాయ నమః అనుచు ప్రోక్షించి ఆ నేలను కుడిచేతితో చతురశ్రముగ తుడిచి శుద్ధిచెంబును అచట ఉంచవలయును. వంట పాత్రలు మున్నగు వానిని కూడా ఇట్లే శుద్ధిచేసి ఉంచుకొనవలయును.

పిమ్మట మడి బట్టలను కట్టుకొని ఆచమనము చేసి పుండ్రధారణము కావించుకొనవలయును. పుండ్రమును లేక తిలకమును ధరించు నప్పుడు; కేశవాయ నమః, శ్రియై నమః అని ఉచ్చరించవలయును. చక్రాంకితమైనవారు గురుపరంపరా శ్లోకములను అనుసంధించు

కొనుచు ఆచార్య తిరువడి వస్త్రములను కన్నులకు అద్దుకొని శ్రీ పాదతీర్థము తీసికొనవలయును.

—: సూర్య సందర్శనము :—

ఉపనయనమైనవారు సంధ్యావందన మొనర్చు కోవలయును. కానివారు మూడు పర్యాయములు ప్రాణాయామ మొనర్చి సూర్యుని దర్శించి సూర్యమండలము లోనుండు శ్రీమన్నారాయణుని ఇట్లు ధ్యానింపవలెను.

ధ్యేయస్సదా సవితృమండల మధ్యవర్తీ
నారాయణ స్సరసి జాసన సన్నివిష్టః।
కేయూరవాన్ మకరకుండలవాన్ కిరీటీ
హారీ హిరణ్మయవపుః ధృత శంఖ చక్రః॥

—: దీపారాధన :—

భగవస్తుని సన్నిధిలో నందా దీపమును వెలిగించి

దీపం జ్యోతిః పరం బ్రహ్మ దీపం సర్వతమోపహామ్॥

ధీపేనాసాద్యతే సర్వం దేవ దీప నమో஽స్తుతే॥ అని
అను సంధింపవలయును.

—: తులసిని కోయుట :—

ఆరాధనకై తులసీదళమును కోయునపుడు,

తులస్య మృత జన్మా஽సి
సదా త్వం కేశవ ప్రియే।
కేశవార్థం లునామి త్వాం
వరదా భవ శోభనే॥ అని

అనుసంధించి తులసీ దళములను కోయవలయును
పిమ్మట భగవదారాధన గావింపవలయును.



శ్రీరస్తు

# లఘు పూజా విధానము

(తిరువారాధన)

కావలసిన వస్తువులు:-

1. పెరుమాళ్ళ ఫోటో
2. చందనము
3. పుష్పములు
4. అగరువత్తులు
5. కర్పూరము
6. పండ్లు లేక కలకండ
7. తాంబూలము
8. హారతి ఇచ్చుటకు చిన్నప్లేటు

పూజా ప్రారంభము :

నమోఽస్మదాచార్య పరంపరాభ్యో
నమో నమో భాగవత ప్రజాయ।
నమోనమోఽనంతముఖామరేభ్యః
నమ శ్శ్రియై శ్రీపతయే నమోఽస్తు॥

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



కూర్మాదీన్ దివ్యలోకాన్ తదనుమణిమయం
మంటపం తత్ర శేషం
తస్మిన్ ధర్మాది పీఠం తదుపరి కమలం
చామర గ్రాహిణీశ్చ।
విష్ణుం దేవీ ర్విభూషాయుధ గణమురగం
పాదుకే వైనతేయం
సేనేశం ద్వారపాలాన్ కుముదముఖ గణాన్
విష్ణుభక్తాన్ ప్రపద్యే।

సవ్యం పాదం ప్రసార్య శ్రితదురితహరం
దక్షిణం కుంచయిత్వా
జానున్యాధాయ సవ్యేతరం ఇతర భుజం
నాగ భోగే నిధాయ।
పశ్చాద్బాహుద్వయేన ప్రతిభటశమనే
ధారయన్ శంఖ చక్రే

దేవీ భూషాదిజుష్టో జనయతు జగతాం
శర్మ వైకుంఠ నాథః

స్వ శేషభూతేన మయా స్వీయై స్సర్వ పరిచ్ఛదైః
విధాతుం ప్రీత మాత్మానం దేవః ప్రక్రమతేస్వయమ్॥

అనిపఠించుచు శ్రీమన్నారాయణుని ధ్యానింపవలయును.

సమస్తపరివారాయ సర్వ దివ్యమంగళ విగ్రహాయ
శ్రీమతే నారాయణాయ నమః

ఆవాహయామి అనుచు స్వామిని పూజాస్థలమునకు
విచ్చేయమని ప్రార్థింపవలయును.

ఆసనం సమర్పయామి అని రత్నసింహాసనమున స్వామి
కూర్చొనినట్లు భావింపవలయును.

గంధాన్ ధారయామి అని చందనమును స్వామికి సమ
ర్పింపవలయును.

పుష్పాణి సమర్పయామి అని పుష్పమాలికను సమర్పించి

ధూపమాఘ్రాపయామి అని అగరువత్తితో ధూపము సమర్పించి,

దీపం దర్శయామి కర్పూరహారతి సమర్పించి,

తులసీ దళైః పుష్పైః చ పూజయామి

ఓం కేశవాయ నమః ఓం పద్మనాభాయ నమః
ఓం నారాయణాయ నమః ఓం దామోదరాయ నమః
మాధవాయ సంకర్షణాయ
గోవిందాయ వాసుదేవాయ
విష్ణవే ప్రద్యుమ్నాయ
మధుసూదనాయ అనిరుద్ధాయ
త్రివిక్రమాయ పురుషోత్తమాయ
వామనాయ అధోక్షజాయ
శ్రీధరాయ నారసింహాయ
హృషీకేశాయ అచ్యుతాయ

జనార్దనాయ హరయే
ఉపేంద్రాయ శ్రీకృష్ణాయ నమః

అని పూజించిన పిమ్మట లక్ష్మీనారాయణ అష్టోత్తరశత నామావళితో గాని శ్రీకృష్ణాష్టోత్తర శతనామావళితో గాని పూజింపవలయును.

శ్రీరామ శ్రీనృసింహాది మూర్తులను ఆరాధించునపుడు వారివారి అష్టోత్తరశతనామావళులకు ముందు వారివారి మంత్రములు ధ్యానశ్లోకములు ఇవ్వబడియున్నవి. కేశవాది ద్వాదశనామములతో అర్చించిన పిదప ఆయామూర్తుల అష్టోత్తరశతనామావళులతో పూజింపవలయును. అష్టోత్తర శతనామార్చన పూర్తియైన పిదప ..

మా ప్రచురణ అష్టోత్తర శతనామావళులను చూడుడు

ఓం శ్రీమహాలక్ష్మ్యై నమః శ్రీమతే విష్వక్సేనాయ నమః
శ్రీభూదేవ్యై నమః శ్రీపరాంకుశాయ నమః
శ్రీనీళాదేవ్యై నమః శ్రీమతే రామానుజాయ నమః
శ్రీగోదాదేవ్యై నమః శ్రీమద్వరవరమునయే నమః
శ్రీఅనంతాయ నమః అస్మద్గురుభ్యో నమః
శ్రీగరుడాయ నమః అస్మత్సర్వగురుభ్యో నమః

ఓం సమస్త పరివారాయ సర్వదివ్యమంగళ విగ్రహాయ శ్రీమతే నారాయణాయ నమః

పారాయణ :

అని పఠించి పుష్పములను సమర్పించవలయును. భగవత్సన్నిధిలో భగవంతునకు కుడివైపున కూర్చొని యథావకాశము శ్రీవిష్ణు సహస్రనామము, మొదలగు స్తోత్రములను భగవద్గీతా మొదలగు గ్రంథములను పారాయణమొనర్పవలయును.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



—: పారాయణ పూర్తి అయిన పిమ్మట :—

కాయేనవా చామనసేన్ద్రియైర్వా
బుధ్యాత్మనావా ప్రకృతే స్స్వభావాత్
కరోమి యద్యత్ సకలం పరస్మై
నారాయణాయేతి సమర్పయామి॥

యదక్షర పదభ్రష్టం మాత్రాహీనంచ యద్భవేత్
తత్సర్వం క్షమ్యతాం దేవ నారాయణ నమోస్తుతే॥
అని నమస్కరింపవలెను.

నివేదన :- కదళీఫలం శర్కరాంనివేదయామి అని. ఆర
గింపు చేయుచు

యా ప్రీతిర్విదు రార్పితే మురరిపో
కున్త్యర్పితే యాదృశీ
యా గోవర్ధన మూర్ధ్ని యా చ పృథుకే
స్తన్యే యశోదార్పితే

భారద్వాజ సమస్పితే శబరికా
దష్టే ఫలే యాదృశీ
యా ప్రీతి ర్మునిపత్ని భక్తిరుచితే
సత్యాపి తాంతాం కురు॥

అను శ్లోకములను అనుసంధింపవలయును.

సాల గ్రామములు, విగ్రహములు ఉన్నచో ఉపనయనమైనవారు తిరువారాధన చేసి ప్రసాదమును ఆరగింపు సమర్పించవలయును.

(అన్న నివేదనమును ఇంటిలో ఒక్కరు చేసిన చాలును.)

తాంబూలం సమర్పయామి:- అని తాంబూలమును
సువర్ణ మంత్ర పుష్పం సమర్పయామి:-
అని యత్ కించిత్ దక్షిణ సమర్పించి;

—: కర్పూర హారతి :—

కర్పూరనీరాజనం సమర్పయామి అని
కర్పూర హారతి సమర్పించుచు

లక్ష్మీచరణ లాక్షాంక సాక్షి శ్రీవత్సవక్షసే।
క్షేమంకరాయ సర్వేషాం శ్రీరంగేశాయ మంగళమ్॥

శ్రియఃకాన్తాయ కల్యాణ నిధయే నిధయేర్థినాం।
శ్రీవేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్॥

అస్తు శ్రీస్తన కస్తూరీ వాసనావాసితోరసే।
శ్రీహస్తిగిరి నాథాయ దేవరాజాయ మంగళమ్॥

కమలాకుచ కస్తూరీ కర్దమాంకిత వక్షసే।
యాదవాద్రి నివాసాయ సంపత్పుత్రాయ మంగళమ్॥

మంగళం కోసలేన్ద్రాయ మహనీయ గుణాబ్ధయే।
చక్రవర్తి తనూజాయ సార్వభౌమాయ మంగళమ్॥

అస్తు గోపాల బాలాయ నిత్యాయ పరమాత్మనే।
భక్తవాత్సల్య నిధయే ముక్తి భోగ్యాయ మంగళమ్॥
నీలాచల నివాసాయ నిత్యాయ పరమాత్మనే।
సుభద్రా ప్రాణనాథాయ జగన్నాథాయ మంగళమ్॥

కర్కటే పూర్వఫల్గున్యాం జాతాయై తులసీవనే।
విష్ణుచిత్త తనూజాయై గోదాయై నిత్యమంగళమ్॥

శ్రీనగర్యాం మహాపుర్యాం తామ్రపర్ణ్యుత్తరే తటే।
శ్రీతింత్రిణీ మూలధామ్నే శఠగోపాయ మంగళమ్॥

శ్రీమదాలి శ్రీనగరీ నాథాయ కలివైరిణే।
చతుష్కవి ప్రధానాయ పరకాలాయ మంగళమ్॥

శేషో వా సైన్యనాథో వా శ్రీపతిర్వేతి సాత్త్వికైః।
వితర్క్యాయ మహాప్రాజ్ఞైః భాష్యకారాయ మంగళమ్॥

తులామూలావతీర్ణాయ తోషితాఖిల సూరయే।
రమ్యజామాతృమునయే శేషాంశాయాస్తు మంగళమ్॥

మంగళాశాసనపరైః మదాచార్యపురోగమైః।
సర్వైశ్చ పూర్వైరాచార్యైః సత్కృతాయాస్తు మంగళమ్॥

వేదాత్మక ప్రమాణేన సాత్త్వికైశ్చ ప్రమాతృభిః।
ప్రమేయేణ సహ శ్రీమాన్ వర్ధతాం యతిశేఖరః॥

పా॥ పల్లాణ్డు పల్లాణ్డు పల్లాయిరత్తాణ్డు
పలకోడి నూరాయిరమ్।
మల్లాణ్డ తిణ్డోళ్ మణివణ్ణా-ఉన్
శేవడి శెవ్వి తిరుక్కాప్పు
అడియోమ్ మోడుం నిన్నొడుం పిరివిన్ని
యాయిరం పల్లాండు
వడివాయ్ నిన్ వలమార్పినిల్
వాళ్గిన మజ్గైయుం పల్లాణ్డు।
వడివార్ శోది వలత్తుఱైయుం
శుడరాళియుం పల్లాండు
పడై పోర్ పుక్కు ముళఙ్గు
మప్పాంచశన్నియముం పల్లాణ్డే
సర్వోపచారాన్ సమర్పయామి అని నమస్కరించి
ఉపచారాపదేశేన కృతానహరహర్మయా
అపచారానిమాన్ సర్వాన్ క్షమస్వ పురుషోత్తమ।

అని అనుసంధింపవలెను. పిమ్మట యథోత్సాహము నామ సంకీర్తన మొనర్పవలెను.

—: ప్రతి దినము చదువుకొన నారంభించు నపుడు :—

జ్ఞానానంద మయం దేవం నిర్మల స్ఫటికా కృతిమ్।
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే॥

శారదా శారదాంభోజ వదనా వదనాంబుజే।
సర్వదా సర్వదాస్మాకం సన్నిధి స్సన్నిధిం క్రియాత్ ॥

అని పఠించుచు శ్రీహయగ్రీవమూర్తిని, సరస్వతీదేవిని ధ్యానింపవలయును. పిమ్మట

అజ్ఞాన తిమిరాంధస్య జ్ఞానాంజన శలాకయా।
చక్షురున్మీలితం యేన తస్మై శ్రీ గురవే నమః॥
నమః పరమ ఋషిభ్యః, అస్మద్గురుభ్యోనమః। అని గురు ధ్యానము చేయవలయును.

—: కార్యార్థియై ఇంటినుండి బయలుదేరు నప్పుడు :—

దుర్ముహూర్తాదులు లేని శుభ సమయమును, శుభ శకునమును చూచుకొని,

అగ్రతః పృష్ఠతశ్చైవ పార్శ్వతశ్చ మహాబలౌ।
ఆకర్ణ పూర్ణ ధన్వానౌ రక్షేతాం రామలక్ష్మణౌ॥
సన్నద్ధః కవచీ ఖడ్గీ చాప బాణధరో యువా।
గచ్ఛన్మమాగ్రతో నిత్యం రామః పాతు స లక్ష్మణః॥
లాభ స్తేషాం జయ స్తేషాం కుత స్తేషాం పరాభవః।
యేషా మిన్దీవర శ్యామో హృదయస్థో జనార్దనః॥

అని అనుసంధించుచు రామలక్ష్మణులుతనను రక్షించుచు తన వెంటనున్నట్లు భావించి బయలుదేర వలయును.

- ఏదేని మందు తీసికొనవలసి వచ్చినప్పుడు -

అచ్యుతానన్త గోవింద నామోచ్చారణ భేషజాత్।
నశ్యంతి సకలా రోగాః సత్యం సత్యం వదామ్యహమ్॥

శరీరే ఝర్ఝరీభూతే వ్యాధిగ్రస్తే కళేబరే।
ఔషధం జాహ్నవీతోయం వైద్యో నారాయణో హరిః
ధన్వంతరిం గరుత్మంతం ఫణిరాజం చ కౌస్తుభమ్।
అచ్యుతం చామృతం చంద్రం స్మరేదౌషధసేవనే॥
అని అనుసంధించి ఔషధమును సేవింపవలయును.

-: ఏదేని శుభకార్యమును ప్రారంభించునపుడు :-

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్।
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వ విఘ్నోప శాంతయే
యస్య ద్విరద వక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్।
విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం త మాశ్రయే॥
తదేవ లగ్నం సుదినం తదేవ
తారాబలం చంద్రబలం తదేవ।
విద్యాబలం దైవబలం తదేవ
లక్ష్మీపతే తేఽంఘ్రియుగం స్మరామి॥

అని పఠించుచు శ్వేతవస్త్రధారియై, ప్రసన్న వదనుడై నాలుగు చేతులు కలిగి, తెల్లని కాంతితో వెలుగొందు చున్న శ్రీమహావిష్ణువును కార్యసిద్ధికై ధ్యానించి ప్రార్థింపవలయును. ఆ కార్యము పూర్తి అయినంతనే "సర్వం శ్రీకృష్ణార్పణ మస్తు" అని అనుసంధించవల యును.

—: భోజనము :—

భోజనమునకు ముందు కాళ్ళు చేతులు శుభ్రముగ కడుగుకొని ఆచమనము గావించి మడిబట్ట కట్టుకొని ప్రశాంతమైన మనస్సుతో భగవంతుని ధ్యానించుచు అన్న మును తీర్థముతో ప్రోక్షించి అమృతస్వరూపముగా తలంచి గోవిందనామస్మరణ మొనర్చుచు నేతితో కూడిన (అన్న పు) మెతుకులను అయిదు పర్యాయములు నోటిలో వే సుకొని మిగిలింగి భక్ష్య మిశ్రితాదులతో కలసి భుజింపవలయును

## —: భోజనానంతరము :—

భోజనానంతరము శుభ్రముగ పుక్కిలించి యుమిసి పిదప కాళ్ళు చేతులు శోధించుకొని ఆచమన మొనర్పవలయును. తరువాత,

అగస్తి రగ్ని ర్బడబానలశ్చ
భుక్తం మమాన్నం జరయం త్వశేషమ్।
సుఖం మమైతత్ పరిణామ సంభవం
యచ్ఛ త్వరోగో మమ చాస్తు దేహః॥

అని అనుసంధింపవలయును.

## —: సాయంకాలము :—

సాయం సంధ్యాసమయమున స్నానమొనర్చి మడిబట్టలు ధరించి పుండ్రధారణము గావించి ఆచమన మొనర్చి సూర్యుని సందర్శించి, ధ్యానించి ముందు చెప్పిన రీతిగా భగవత్సన్నిధిలో దీపారాధన చేసి.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



శ్రీరంగ మంగళమణిం కరుణా నివాసం
శ్రీవేంకటాద్రి శిఖరాలయ కాలమేఘమ్।
శ్రీహస్తిశైల శిఖరోజ్జ్వల పారిజాతం
శ్రీశం నమామి శిరసా యదుశైలదీపమ్।

వసా పరిమళోల్లాస వాసితాధర పల్లవమ్।
ముఖం వరదరాజస్య ముగ్ధస్మిత ముపాస్మహే॥

వేగవత్యుత్తరే తీరే పుణ్యకోట్యాం హరి స్స్వయమ్।
వరద స్సర్వభూతానాం అద్యాపి పరిదృశ్యతే॥

వేంకటాద్రి సమం స్థానం బ్రహ్మాండే నాస్తి కించన।
వేంకటేశ సమోదేవో నభూతో న భవిష్యతి॥

వైకుంఠే పరమానందం త్యక్త్వా వైకుంఠ ముత్తమమ్।
స్వామి పుష్కరిణీ తీరే రమయా సహ మోదతే॥

ఆనంద నిలయే శేషతల్పే వేంకట భూధరే।
క్రీడంతం రమయా సార్థం శ్రీనివాస మహం భజే॥

గోవిందేతి యదా క్రందత్ కృష్ణా మాం దూరవాసినమ్
ఋణం ప్రవృద్ధమివ మే హృదయాన్నాపసర్పతి॥

హా! కృష్ణ! ద్వారకావాస! క్వాఽసి యాదవ నందన।
ఇమా మవస్థాం సంప్రాప్తాం అనాథాం కి మపేక్షసే॥

శంఖ చక్ర గదా పాణే! ద్వారకా నిలయాఽచ్యుత।
గోవింద పుండరీకాక్ష! రక్షమాం శరణాగతామ్॥

శ్రియః కాంతాయ కల్యాణ నిధయే నిధయేర్థినామ్।
శ్రీవేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్॥

కృష్ణం కమలపత్రాక్షం పుణ్యశ్రవణ కీర్తనమ్।
వాసుదేవం జగద్యోనిం నౌమి నారాయణం హరిమ్॥

కృష్ణాయ యాదవేంద్రాయ జ్ఞానముద్రాయ యోగినే।
నాథాయ రుక్మిణీశాయ నమో వేదాంతవేదినే॥

రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే।
రఘునాథాయ నాథాయ సీతాయాః పతయే నమః॥

ఆపదా మపహర్తారం
దాతారం సర్వసంపదామ్।
లోకాభిరామం శ్రీరామం
భూయో భూయో నమామ్యహమ్॥

నమః కోదండ హస్తాయ సంధీకృత శరాయ చ।
ఖండితాఖిలదైత్యాయ రామాయాపన్నివారిణే॥

నమస్తస్మై వరాహాయ లీలయోద్ధరతే మహీమ్।
ఖుర మధ్యగతో యస్య మేరుః కణకణాయతే॥

తస్య యజ్ఞ వరాహస్య విష్ణోరమిత తేజసః।
ప్రణామం యేపి కుర్వంతి తేషామపి నమోనమః॥

ఉగ్రం వీరం మహావిష్ణుం
జ్వలంతం సర్వతోముఖమ్।
నృసింహం భీషణం భద్రం
మృత్యోర్మృత్యుం నమామ్యహమ్॥

జలేరక్షతు వారాహః స్థలే రక్షతు వామనః।
అటవ్యాం నారసింహశ్చ సర్వతః పాతు కేశవః॥

శ్రీవేంకటాద్రి నిలయః కమలాకాముకః పుమాన్।
అభంగుర విభూతిర్నః తరంగయతు మంగళమ్॥

అని అనుసంధించి లక్ష్మ్యష్టోత్తర శతనామ స్తోత్రము మున్నగు స్తోత్రములను యథావకాశముగా పారాయణ మొనర్చి పండ్లు, పాలు నివేదన చేసి కర్పూర హారతిని సమర్పింపవలెను.

—: దేవాలయ దర్శనము :—

పిమ్మట సమీపమున ఉన్న సన్నిధికి వెళ్ళి ధ్వజ స్తంభము వద్ద "అడియేన్ రామానుజ దాసన్/దాసి" అని అనుచు సాష్టాంగముగా దణ్డము సమర్పించి సన్నిధికి ప్రదక్షిణము చేసి సన్నిధిలోపల ప్రవేశించి, 'భగవద్ద్వారపాలకాభ్యాం నమః' అని, ద్వారపాలకులకు

నమస్కరించి, వారి అనుమతి గైకొని లోనికి ప్రవేశించి, భగవంతుని అత్యంతభక్తితో నిదానముగ పాదాది కేశాన్తము సేవింపవలయును. ఇట్లు శ్రీదేవి, భూదేవిసుదర్శనమూర్తి మున్నగువారిని కూడ సేవింపవలయును. ఆ యామూర్తులను సేవించుచు అనుసంధింపవలసిన శ్లోకములు

—: శ్రీ సీతారామ సందర్శనమున :—

వైదేహీ సహితం సురద్రుమతలే
హైమే మహామండపే
మధ్యే పుష్పక మాసనే మణిమయే
వీరాసనే సుస్థితమ్।
అగ్రేవాచయతి ప్రభంజన సుతే
తత్త్వం మునిభ్యః పరం
వ్యాఖ్యాంతం భరతాదిభిః పరివృతం
రామం భజే శ్యామలమ్॥

—: శ్రీ కృష్ణ సందర్శనమున :—

బాలాయ నీలవపుషే నవ కిఙ్కిణీక
జాలాభిరామ జఘనాయ దిగమ్బరాయ।
శార్దూల దివ్యనఖ భూషణ భూషితాయ
నన్దాత్మజాయ నవనీతముషే నమస్తే॥

చంద్రాననం చతుర్బాహుం
శ్రీవత్సాంచిత వక్షసమ్।
రుక్మిణీ సత్యభామాభ్యాం
సహితం కృష్ణమాశ్రయే॥

—: శ్రీ నరసింహ స్వామి సందర్శనమున :—

శ్రీమన్నృసింహ విభవే గరుడధ్వజాయ
తాపత్రయోప శమనాయ భవౌషధాయ।
తృష్ణారి వృశ్చిక జలాగ్ని భుజంగ రోగ
క్లేశ వ్యయాయ హరయే గురవే నమోస్తు॥

—: శ్రీ వరహా స్వామి సందర్శనమున :—

నమస్తస్మై వరాహాయ లీలయోద్ధరతే మహీమ్।
ఖుర మధ్యగతో యస్య మేరుః కణకణాయతే॥

తస్యయజ్ఞవరాహస్య విష్ణో రమితతేజసః।
ప్రణామం యేపి కుర్వన్తి తేషామపి నమో నమః॥

—: శేషశాయియైన స్వామిని సందర్శించు నపుడు :—

శాన్తాకారం భుజగశయనం పద్మనాభం సురేశం
విశ్వాకారం గగనసదృశం మేఘవర్ణం శుభాఙ్గమ్।
లక్ష్మీకాంతం కమలనయనం యోగి హృద్ధ్యానగమ్యం
వందే విష్ణుం భవభయహరం సర్వలోకైకనాథమ్॥

—: శ్రీ రంగనాథుని సందర్శించి నపుడు :—

పాతు ప్రణత రక్షాయాం విలంబ మసహన్నివ,
సదా పంచాయుధీం బిభ్రత్ సనః శ్రీరంగ నాయకః॥

కావేరీ విరజా సేయం వైకుంఠం రంగమందిరమ్।
స వాసుదేవో రంగేశః ప్రత్యక్షం పరమం పదమ్।

—: శ్రీనివాసుని సేవించునపుడు :—

శ్రియః కాంతాయ కల్యాణ నిధయే నిధయేర్థినామ్।
శ్రీవేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్।

వినా వేంకటేశం ననాథో న నాథః
సదా వేంకటేశం స్మరామి స్మరామి।
హరే వేంకటేశ ప్రసీద ప్రసీద
ప్రియం వేంకటేశ ప్రయచ్ఛ ప్రయచ్ఛ॥

ఇతర కేశవాది మూర్తులను సేవించునపుడు;

స శంఖ చక్రం సగదాసి శార్ఙ్గం
పీతాంబరం కౌస్తుభవత్స చిహ్నమ్।
శ్రియా సమేతోజ్జ్వల శోభితాఙ్గం
విష్ణుం సదాహం శరణం ప్రపద్యే॥

### —: శ్రీ హయగ్రీవ మూర్తిని సేవించు నపుడు :—

జ్ఞానానంద మయం దేవం నిర్మలస్ఫటికాకృతిమ్।
ఆధారం సర్వవిదానాం హయగ్రీవముపాస్మహే॥

### -: శ్రీ ధన్వంతరిని సేవించినపుడు :-

నమామి ధన్వంతరి మాదిదేవం
సురాసురై ర్వందిత పాదపద్మమ్।
లోకే జరా రుగ్భయ మృత్యునాశం
దాతార మీశం వివిధౌషధీనామ్॥

శంఖం చక్రముపర్యధశ్చ కరయో
ర్దివ్యౌషధం దక్షిణే
వామేనాఽన్య కరేణ సంభృత సుధా
కుంభం జ్వలత్కాపిలిమ్।
బిభ్రాణః కరుణాకర శ్శుభకర
స్సర్వామయ ధ్వంసకః

స్సర్వం మే దురితం ఛినత్తు భగవాన్
ధన్వంతరి స్సంతతమ్॥
ఈ ధన్వన్తరి సన్నిధి శ్రీరంగమున గలదు.

:- శ్రీ లక్ష్మీదేవిని సేవించు నపుడు :-

లక్ష్మీం క్షీర సముద్రరాజ తనయాం
శ్రీరంగ ధామేశ్వరీం
దాసీభూత సమస్తదేవవనితాం
లోకైక దీపాంకురామ్।
శ్రీమన్మంద కటాక్ష లబ్ధ విభవ
బ్రహ్మేంద్ర గంగాధరాం
త్వాం త్రైలోక్య కుటుంబినీం సరసిజాం
వన్దే ముకున్ద ప్రియామ్॥

ఓం భగవ న్నారాయణాభిమతానురూప స్వ
రూప రూప గుణ విభవైశ్వర్య శీలాద్యనవధికాతిశయా

సంఖ్యేయ కల్యాణ గుణగణాం-పద్మవనాలయాం-భగవతీం-శ్రియం దేవీం-నిత్యానపాయినీం-నిరవద్యాం-దేవదేవ దివ్యమహిషీం-అఖిల జగన్మాతరం-అస్మన్మాతరం అశరణ్య శరణ్యాం-అనన్యశరణః-శరణమహం ప్రపద్యే॥

ఉల్లాస పల్లవిత పాలిత సప్తలోకీ
నిర్వాహ కోరకిత నేమ కటాక్షలీలామ్।
శ్రీరంగ హర్మ్యతల మంగళ దీపరేఖాం
శ్రీరంగ రాజ మహిషీం శ్రియమాశ్రయామః॥

సహధర్మచరీం శౌరేః సమన్త్రిత జగద్ధితామ్।
అనుగ్రహ మయీం వన్దే నిత్య మజ్ఞాత నిగ్రహామ్॥

-: శ్రీ సుదర్శన మూర్తిని సేవించునపుడు :-

స్ఫురత్సహస్రార శిఖాతి తీవ్రం
సుదర్శనం భాస్కర కోటితుల్యమ్।
సురద్విషాం ప్రాణవినాశి విష్ణోః
చక్రం సదాఽహం శరణం ప్రపద్యే।

-: శ్రీ ఆణ్డాళ్ను సేవించునపుడు :-

నీళాతుంగ స్తనగిరితటీ సుప్తముద్బోధ్య కృష్ణం
పారార్థ్యం స్వం శ్రుతిశతశిర స్సిద్ధమధ్యాపయన్తీ।
స్వోచ్ఛిష్టాయాం స్రజినిగళితం యాబలాత్కృత్యభుఙ్క్తే
గోదా తస్యైనమ ఇదమిదం భూయఏవాస్తు భూయః॥

శ్రీవిష్ణు చిత్త కులనన్దన కల్పవల్లీం
శ్రీరంగరాజ హరిచందన యోగదృశ్యామ్।
సాక్షాత్ క్షమాం కరుణయా కమలామివాన్యాం
గోదామనన్యశరణః శరణం ప్రపద్యే॥

-: పెరుమాళ్ళ తిరువీథిలో వేంచేసినపుడు :-

నమో స్త్వనంతాయ సహస్రమూర్తయే
సహస్ర పాదాక్షి శిరోరు బాహవే।
సహస్ర నామ్నే పురుషాయ శాశ్వతే
సహస్ర కోటీ యుగధారిణే నమః॥

నమః పురస్తాత్ అథ పృష్ఠతస్తే
నమోస్తుతే సర్వత ఏవ సర్వ।
అనంత వీర్యామిత విక్రమస్త్వం
సర్వం సమాప్నోషి తతోసి సర్వః॥

-: ఆదిశేషుని సేవించు నపుడు :-

నివాస శయ్యాసన పాదుకాంశుకో-
పధాన వర్షాతప వారణాదిభిః।
శరీర భేదైర్తవ శేషతాంగతైః
యథోచితం శేష ఇతీరితం భజే।

శ్రీమద్విష్ణు పదాంభోజ పీఠాయిత ఫణాతలమ్।
శేషత్వైక స్వరూపంత మాదిశేష ముపాస్మహే॥

-: గరుడాళ్వారులను సేవించు నపుడు :-

నమః పన్నగ నద్ధాయ వైకుంఠ వశవర్తినే।
శ్రుతి సిన్ధు సుధోత్పాద మన్దరాయ గరుత్మతే।

కుంకుమాంకిత వర్ణాయ కున్దేన్దు ధవళాయ చ।
విష్ణువాహ నమస్తుభ్యం పక్షిరాజాయ తే నమః॥

—: విష్వక్సేనులను సేవించు నపుడు :—

శ్రీరంగ చంద్రమస మిన్దిరయా విహర్తుం
విన్యస్య విశ్వచిద చిన్నయనాధికారమ్।
యో నిర్వహత్యనిశ మంగుళి ముద్రయైవ
సేనాన్య మన్య విముఖా స్త మిహాశ్రయామః॥

వన్దే వైకుంఠ సేనాన్యం దేవం సూత్రవతీసఖమ్।
యద్వేత్రశిఖర స్పన్దే విశ్వ మేత ద్వ్యవస్థితమ్॥

—: ఆంజనేయుని సేవించు నపుడు :—

యత్ర యత్ర రఘునాథ కీర్తనం
తత్ర తత్ర కృతమస్తకాంజలిమ్।
బాష్ప వారి పరిపూర్ణ లోచనం
మారుతిం నమత రాక్షసాన్తకమ్॥

ఉల్లంఘ్య సిన్ధో స్సలిలం సలీలం
యశ్శోక వహ్నిం జనకాత్మజాయాః।
ఆదాయ తేనైవ దదాహ లంకాం
నమామి తం ప్రాంజలి రాంజనేయమ్॥

—: శ్రీ రామానుజుల వారిని సేవించునపుడు :—

యో నిత్యమచ్యుత పదామ్బుజ యుగ్మరుక్మ
వ్యామోహతః తదితరాణి తృణాయ మేనే।
అస్మద్గురో ర్భగవతోఽస్య దయైక సింధోః
రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే।

—: నమ్మాళ్వారులను సేవించునపుడు :—

మాతా పితా యువతయ స్తనయా విభూతిః
సర్వం యదేవ నియమేవ మదన్వయానామ్।
ఆద్యస్య నః కులపతే ర్వకుళాభిరామం
శ్రీమత్తదంఘ్రి యుగళం ప్రణమామి మూర్ధ్నా॥

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



—: పన్నిద్దరాళ్వారులను సేవించునప్పుడు :—

భూతం సరశ్చ మహదాహ్వయ భట్టనాథ
శ్రీ భక్తిసార కులశేఖర యోగివాహాన్।
భక్తాంఘ్రిరేణు పరకాల యతీన్ద్రమిశ్రాన్
శ్రీ మత్పరాంకుశ మునిం ప్రణతోస్మి నిత్యమ్॥

—: శ్రీ మద్వేదాంత దేశికులను సేవించునపుడు :—

శ్రీమాన్ వేంకటనాథార్యః కవితార్కిక కేసరీ।
వేదాన్తాచార్య వర్యో మే సన్నిధత్తాం సదా హృది।

-: శ్రీ మణవాళ మహామునులను సేవించునపుడు :-

శ్రీ శైలేశ దయాపాత్రం ధీ భక్త్యాది గుణార్ణవమ్।
యతీన్ద్ర ప్రవణం వందే రమ్యజామాతరం మునిమ్॥

-: భగవత్సన్నిధిలో తీర్థమును తీసుకొనినపుడు:-

అకాల మృత్యుహరణం సర్వవ్యాధి నివారణమ్।
సర్వ పాప క్షయకరం విష్ణుపాదోదకం శుభమ్॥